[చినిగిన కంబళి గప్పు కొని, చేత వంకర కఱ్ఱ బూని వటుడు ప్రవేశము]

మొదటి—ఎచ్చటికిఁ బోవుచుంటివి, వటుఁడా ?

వటుఁడు—జాగ్రత్త, మిత్రులారా ! ఆ దారిని బోకుఁడు! కాలము మించకుండఁ దిరిగి పొండు !

మొదటి—ఏమి ? ఏమి ?

వటుడు—బలి వేయుదురు,—మానవుల, బలి వేయుదురు. నా పుత్రుల నిద్దరి బలాత్కారముగఁ గొనిపోయిరి ; వారు తిరిగి రారైరి.

మూఁడవ—బలియే ! ఎవరికి ?

వటుఁడు—తృష్ణా పిశాచమునకు!

రెండవ—అది యెవరు ?

వటుఁడు—తైల పోషిత యగ్ని జ్వాల వలె వృద్ధి యగు చుం[illegible] హరిన నాలుక గల పిశాచము.

మొదటి—పిచ్చివాఁడా ! మేము భైరవాలయమునకుఁ బోవు చున్నాము. నీ తృష్ణా పిశాచ మచట లేదే !

వటుఁడు—నీ కీ వార్త తెలియదా? నేఁడు భైరవుని సింహా సనము నుండి తొలగింప నున్నారు; పిమ్మట తృష్ణాపిశాచ మాపీఠ ము నధిష్టించును.

రెండవ—నోరు మూయుము. పిచ్చి వాఁడా ! నీ విటు మా టాడ వినినచో నుత్తర కూట వాసులు నిన్ను తుత్తునియలు సేయుదు



వటుఁడు—వారు నాపై మట్టి విసరుచున్నారు; చిన్న వాండ్రు టాలు అవ్వుచున్నారు. ప్రాణ సమర్పణము చేసి నా మనుమలు ధన్యత గాంచిరని యంద అనుచున్నారు.

పెండటి—అది నిజమే!

వటుఁడు—నిజమేనా? ఒక్క ప్రాణము పోయిన నింకొక ప్రాణము రావలెను. మృత్యువునకు బహుమానము మృత్యువుకాదు. అట్లు కానియెడల భైరవుఁడింత గొప్ప కష్టమును సైరింపఁడు జాగ్రత్త; మిత్రులారా! ఆ బాటను బోవలదు.

(వటుఁడు పోవును)

కొండవ—ఇగని పలుకులు గుండె ఝల్లుమన చేసివణఁకు బుట్టించుచున్న వని చెప్పక తీరదు.

పెండటి—రంజా, నీవు పట్టి పిఱికి వాఁడవు. పోదము పద.

(అందఱు నిష్క్రమింతురు)

[యువరాజగు నభిజిత్తు, రాజకుమారుఁడు సంజయుఁడు, ప్రవేశము]

సంజయ—మా నగరు నీ వేల విడచుచుంటివో నాకు బోధపడ లేదు.

అభిజిత్తు—నీ కది పూర్తిగ బోధపడదు. నా జీవిత వాహిని రాజగృహ శిలల దాఁటి నిరాటంకముగఁ బ్రవహించును; దీని నీ వెట్లు గ్రహింపఁగలవు.

సంజయ—నీకు కొన్ని దినములుగ చిత్త శాంతి లేదని మాకు గోచరించినది. నిన్ను మాతోఁ జేర్చియుంచిన బంధము దిన దినము సడలుచున్న దేమో యని తోఁచుచు డెను. తుద కది తెగిపోయెనా?

అభిజిత్తు—సంజయా! గౌరీ శృంగమున నస్తమించు భానుబింబమును తిలకింపుము. అగ్ని ప్రభను బోలు నీ యుజ్జ్వల పతంగము తన పక్షములఁ జాపి నక్షత్రపథంబునఁ బోవుచున్నది. సాహసాంకిత మగు నా జీవయాత్రా చిత్రము నస్తంగత సూర్యుఁ డంబర తలంబున లిఖించి యున్నాఁడు.

సంజయ—ఆ చిత్రము నాకు భిన్నముగా నున్నది. అల్లదె! యంత్రాగ్రము సంధ్యా ధూర్జటి హృదయము నెట్లు చీల్చుచున్నదో చూఁడుము. ఏటు దినిన పులుఁగు తల క్రిందుగ నిశా సానువునఁ బడిన చందము దోఁచుచున్నది. ఇది దుశ్శకునము. విశ్రాంతి గైకొన సమయమిది. నగరు లోనికి రమ్ము.

అభిజిత్తు—అట కనున్నచో విశ్రాంతి గలుగదు.

సంజయ—ఇన్ని నాళ్ళుగఁ దోచని దిపుడేటు లాటంకమని తోచునది ?

అభిజిత్తు—ముక్తధారా ప్రవాహమును వారు బంధించిరని వినినపుడు నాకది గోచరించె.

సంజయ—ఈ మాటల యర్థము నాకు బోధ పడుట లేదు.

అభిజిత్తు—ఒక్కొక్కని యాత్మ యాత్రా రహస్యము బాహ్య ప్రపంచమున నెచ్చోటనో లిఖింపఁ బడి యుండును. స్వీయ యాత్రా రహస్యము ముక్తధారా జల పాతమున గుర్తింపఁ బడి యున్నది. దాని కదలకుండ బంధించుట గాంచిన తోడనె నా ప్రాణములు తమ స్థానమును బాసినట్లాయెను. ఉత్తర కూట రాజ్యాధిపతియు నా ప్రాణ వాహినికిఁ జెలియలి కట్టయని గ్రహించితి. కావున, దాని నిరోధ రహితము గాఁ జేయుట కీలు వెలు బడితి.

సంజయ—నీ యనుచరునిగ నన్ను గొనిపొమ్ము.

అభిజిత్తు—అటుగాదు! నీ దారిని నీవ వెదకి కొన వలయు. నీవు నా వెంట వచ్చిన నియతమగు నీ సొంత దారిని నేను గప్పి పుచ్చిన వాఁడ నగుదు.

సంజయ—అంత కాఠిన్యము సహింపకుఁడు. నాకు నొప్పి గల్గుచున్నది.

అభి—నా హృదయము నీకుఁ దెలిసినదే, గాన నీకు నొప్పి గల్గించినను నీవు నా యెడఁ దప్పభిప్రాయ పడవు.

సంజయ—నీకెచట నుండి యీ సందేశము వచ్చినదో దానిని

గూర్చి నిన్ను పృచ్ఛ చేయను. దాని సంబంధ నిమ్ము; యువరాజా! అదె సాయంకాలమైనది, నిశాగమన సమయరాగము రాజగృహో పరి భాగమునుండి వీచికలభాతిఁ జనుదెంచు చున్నది. దీని సందేశము నీకు వినఁబడుట లేదా? కఠోరములై కష్టసాధ్యము లగునవన్ని యు కీర్తిప్రదములై యుండిన నుండవచ్చును; కాని మృదులంబు లగు వానికిఁగూడ విలువ లేక పోలేదు.

అభి—కష్టముల నాచరించుట సుఖముల గొనుటకే కద.

సంజయ— దేవతార్చనా పీఠముకడ నున్న నొక సితాంభోజము గని విస్మయము జెందితివి; నీకు జ్ఞాపకమున్నదా? ప్రభాతమునను నీవు మేల్కాంచకమునుపె యెవతయో యీ పుష్పమును గోసి యుంచును. అది యెవతయో నీకు దెలియలేదు. ఈ స్వల్ప విషయమున నిమిడియున్న దైవప్రసాదమును, ఇట్టితరుణమున నీవు నిర్లక్ష్యభావములోఁ జూడ నగునా? తాను ప్రచ్ఛన్నమున నుండి తనకానుక నెదుట నుంచిన పాప మాపడుచు ఎల్లప్పుడూ నీ స్మరణకు వచ్చుటలేదా?

అభి—అవును వచ్చుచునే యున్నది! ప్రపంచ మందున్న నిట్టి యనురాగము కొఱకై, నేనీ భీభత్సపు రూపము సయింపజాలను. అయ్యది ప్రకృతిరాగమును నశింపఁజేసి యంతరాళమున దన అరోమయ దంతపంక్తులఁ బ్రదర్శించుచు నపహసించును. దివ్య స్వర్గమును నభిలషింతును కావుననే అందులకు భంగము కలిగించు రాక్షసులతోఁ బోరుటకు సంసిద్ధుఁడనయి యున్నాను.

సంజయ—అల్లదె యా జేగురు గొండ నాశ్రయించి యున్న సంధ్యా రాగము లోన దుఃఖము చిత్రితమై యుంట చూచితివా?

అభి—లేకేమి! నా హృదయము శోక పూరితమై యున్నది. కాతర్యమును శౌర్యమని నే నెన్నటికిని గొనియాడను. చింత మ్రాని అత్యున్నత శాఖాగ్రము పై నేకతమున గూర్చుండి యున్న యా చిన్న పిట్ట నవలోకింపుము. అది తన కులాయమునకు జేరుకొనక బోవునో లేక, యా చీకటిలో వి దూరస్థ కాంతారంబున కుం బ్రయాణ ముం గొనునో నే నూహింపజాల. క్రుంక నున్న దివాకరు నంత్య కిరణము పై దృష్టిసారించుచు నొంటిగ నున్న పిట్టను జూడ నా హృదయాంత రాళ మానంద జనకమగు విచారముతో వెల్లి విరియుచున్నది. ఆ హా! ఈ ప్రపంచ మెంత రమణీయముగ నున్నది! నా జీవితమున కింపు గూర్చు వాని కెల్ల నివియె నా ప్రణామములు.

[వటుఁడు ప్రవేశము]

వటు—నన్ను బోనీయక దెబ్బలఁగొట్టి వెనుకకుఁ దఱిమి వేసిరి.

అభి—నీ కేమాయెను, వటుఁడా? నీ నుదుట గాయ మున్నదే దాని నుండి అయ్యో! రక్తము కారుచున్నది.

వటు—వారిని జాగ్రత్తగా నుండుమని చెప్పుటకు బయట వచ్చితి; ఆ బాటను వీడి తిరిగి పొమ్మని యఱచితిని.

అభి—అట్లేల జేసితివి ?

వటు—రాజ కుమారా! నీ వెఱుఁగవా ? యంత్రఁపు బలిపీఠమున దృష్ణాపిశాచము నెక్కింప నున్నారు. ఆపిశాచమునకు మానవ బలి నర్పింతురు.

సంజయ — ఈ యసంబద్ధ ప్రలాపము లేమి ?

వటు — ఇదివఱకే యీబలిపీఠంపు పునాదిని నాయిద్దఱి పౌత్రుల రక్తమును బోసితి. స్వీయాధర్మ భావముచే నీ పాపపు గుడి ప్రక్కలై పోవు నని యాశించితిని. కాని యటు లింకను జఱుగ లేదు; భైరవ స్వామి యింకను నిద్రనుండి మేల్కాంచనే లేదు.

అభి — సందేహింపకుము, గుడి ముక్కలై పోవును. కాల మాసన్న మైనది.

వటు — (దగ్గఱకు వచ్చి చెవిలో మాటలాడుచు) అయితే, నీవు వినియుంటివి,—విని యుంటివి భైరవాజ్ఞ.

అభి — ఆఁ, నే వింటిని.

వటు — అయిన, నీకుం దప్పించుకొను నుపాయము లేదు ?

అభి — నా కక్కఱడి యుపాయము !

వటు — నా గాయము నుండి రక్తమెట్లు ప్రవహించుచున్నదో చూచుటలేదా ? రాజపుత్రా, నీ హృదయమునకే గాయము తగిలిన నీవు సహింపఁగలవా ?

అభి — భైరవ కటాక్షమున నే సహింపఁజాలుదు.

వటు — ఏమీ ! స్వజనులు నీపై శత్రుత్వముఁబూని వత్తురా ? స్వజనులే నిన్ను నిరాకరించి నపుడునా?

అభి — నే భరింప వలెను !

వటు — అయిన భయము లేదు !

అభి — నాకై భయము లేదు.

వటు — భాగు, భాగు ! నన్ను క్షత్రియం దుంచుకొమ్ము;

నునదే త్రోవకుఁబోవ నుంటి. స్వయముగ భైరవ స్వామి నానుదుటి పైఁబూసిన శోణితపు టూన వాలును బట్టి అంధకారంబున నన్నను గుర్తింపఁగలవు.

(వటుఁడు పోవును.)

[రాజ రక్షకుఁడు, యుద్ధవ్రుఁడు ప్రవేశము]

యుద్ధ—(యువరాజుతో) స్వామీ! నంది కనుమ గుండ బాటను నీవేల తీసితివి ?

అభి—శివతార వాసుల శాశ్వత క్షామము నుండి కాపాడుటకు.

యుద్ధ—మనరాజు సదయుఁడే! వారి కుపకారము సేయుట కాతఁ డనిశము సంసిద్ధుఁడయి యుండలేదా?

అభి—లోభము చేత దక్షిణహస్తము, సమృద్ధి మార్గమును బూడ్చి వేయ, వామ కరమునఁజూపు దాతృత్వ మావంతయు నుపయోగకారి కాదు. కావునశివతార లోనికి జీవనోపాధికి వలయు సామగ్రిఁగొంపోవు మార్గమును తెఱచి వైచితిని. దారిద్ర్యా శ్రియ మైన కరుణనే పంకు సేయను.

యుద్ధ—రాజుగా రక్షనది, నంది కనుమ లోని దుర్గమును బ్రద్దలు చేసి, యుత్తరకూటమువారి ఆహారపాత్ర మట్టి నూడబెఱికితివని.

అభి—ఎల్లకాలము శివతారనాశ్రయించు కొని యుండకుండఁ జేసి యుత్తరకూటమునకు స్వైరంబు నిడితి.

యుద్ధ—అందు నీ వమితాటోపమున వర్తించితివి. రాజున

వార్త తెలిసినది. ఇంతకు మీరు చెప్పనే సాహసింపఁజాలరు. చేత నయిన తక్షణమె యిచ్చోటు వీడిపొమ్ము. త్రోవలో నీతో మాటలాడుచున్నప్పు డెవరయిన నన్నుఁ జూచిన కొంప మునుఁగును.

(యుద్ధవుఁడు పోవును)

[అంబ ప్రవేశము.]

అంబ—సుమనా, సుమనా! నా సుమనుని గొంపోయిన వారిని మీలో నొక్కఁడయిన బోలేదా?

అభి—నీ తనయుని గొంపోయిరా?

అంబ—అవును పశ్చిమమునకు; ఇనుఁడస్తమించెడి, దినము లంతమొందెడి యాదిశకు.

అభి—నా ప్రయాణము కూడ యా బాటనే.

అంబ—అటులయిన, నే నిర్భాగ్యురాలను. నన్ను మఱువకుము. అతని గలసికొనిన, అమ్మ వేచి యున్నదని చెప్పుము.

అభి—సరే, చెప్పెదను.

(అంబ పోవును.)

[భైరవార్చకులు పాడుచుఁ బ్రవేశింతురు.]

జయ భైరవ జయ శంకర
జయ జయ జయ ప్రళయంకర
శంకర శంకర.
జయ సంశయ భేదన
జయ బంధన ఛేదన
జయ సంకట సంహార
శంకర శంకర.

[ఎల్లరు నిష్క్రమింతురు.]



# ముక్తధార

(విజయపాలుఁడను యోధుఁడు ప్రవేశము.)

విజయ—రాజపుత్రులారా! నా వినయపూర్వక వందనములఁ గైకొనుఁడు. నేను రాజుగారి యొద్ద నుండి వచ్చితి.

అభి—వారియాజ్ఞ యేమి?

విజయ—మీతో నేకాంతమునఁ జెప్పవలెను.

సంజయ—(అభిజిత్తు హస్తమును బట్టుకొని) ఏకాంతమున వేల?—నాకును రహస్యమా?

విజయ—నాకిడిన యాజ్ఞ యిట్టిది. యువరాజా! గుడారము ప్రవేశింప నిను వేఁడుచున్నాను.

సంజయ—నే నాతని వెంబడి పోయి తీరెద. (పోఁబోవును)

విజయ—కూడదు! అటుచేయుట రాజాభీష్టమునకు వ్యతిరేకమగును.

సంజయ—సరే, నే నీ బాట ప్రక్క నాతనికై వేచి యుందును.

[విజయపాలానుచరుఁడయి యభిజిత్తు గుడారంపు వైపు పోవును]

[పుష్పలావిక ప్రవేశము.]

పుష్ప—(సంజయునితో) అయ్యా, ఈతఁడెవరు, యుత్తరకూట విభూతియా?

సంజయ — అతని నేల వెదకుచుంటివి?

పుష్ప— నా దీయూరు కాదు; దేవతలి నుండి వచ్చుచుంటి. ఉత్తర కూటములో నాతని గ్రీవను పూజింపఁ జల్లుచుంటి రని వింటి. అతఁడొక మహాత్ముఁడయి యుండును గాన నా సొంత పూలదోఁట నుండి, యీ పుష్పములఁ గొని వచ్చితి.

సంజయ__అతఁడు మహాత్ముఁడు కాఁడు; ఉపాయశాలి.

పుష్ప__అతఁడేమి చేసెను?

సంజయ__మా జలపాతమును బంధించెను.

పుష్ప__అందుకొఱకా యింత పూజ? జలపాత బంధనము వలన దైవాభీష్టము సిద్ధించునా?

సంజయ__కాదు, కాదు. అది దైవగతినే యడ్డగించును.

పుష్ప__నాకవగాహనముగా లేదు.

సంజయ__అవగాహనము కాకుండుటయే నీకు మేలు. తిరిగి పొమ్ము, (ఆమె పోవుచుండును) నిలుము; ఒక్కమాట చెప్పుము! ఆ సితాంభోజమును నాకమ్మెదవా?

పుష్ప__దీని నే నమ్మఁగూడదు; ఇదివఱకె దీని నామనంబు నొక మహాత్ముని కర్పించితి.

సంజయ__దీనిని, అందరికంటె నెక్కువగనే గౌరవించు పరమపురుషున కిచ్చెదను.

పుష్ప—అట్లయినఁ దీసికొమ్ము. (అతఁడు వెల నియ్యఁబోవును) వలదు! దీనికి వెల లేదు! నా నమస్కృతుల నా తండ్రికి సమర్పించుము. దేవతలి గ్రామవాసినగు బేవగాల సతియము, పూజ నమ్ముదాన ననియుఁ గూడఁ జెప్పుము.

[ఆమె పోవును]

[విజయ పాలుఁడు ప్రవేశము]

సంజయ—యువరాజెక్కడ?

విజయ—గుడారమున బద్ధుఁడయి యున్నాఁడు.

సంజయ—యువరాజు బంధితుఁడా! ఏమి తగని పొగరు!

విజయ—రాజు గారిడిన యాజ్ఞా పత్ర మిదిగో!

సంజయ—ఎవరి కుట్ర యిది? ఒక్క నిమిష మాతని కడకుఁ బోయెద.

విజయ—క్షమింపుడు, పోనీయఁ జాల.

సంజయ—అయిన నన్నుగూడ బంధింపుము! నేను రాజాజ్ఞ నుల్లంఘించిన వాఁడను!

విజయ—నా కా యుత్తరువు లేదు.

సంజయ—ఆ యుత్తరువును బలవంతమున గొనుటకు నేనె యాతని మొద్దకుఁ బోయెద. (కొంత దూరము పోయి, మరలి వచ్చు ను) నా పేరు చెప్పి యీ సితాంభోజమును యువరాజున కిమ్ము.

[వారు పోవుదురు]

[శివతారనుండి వెంబడించుచున్న పురజనులతో శివతార వా సి యగు బైరాగి ధనంజయుఁడు ప్రవేశము]

ధనం—(అనుచరులలో నొకనితో?) దయ్యము వలె గళా హీనమై యుంటివే! ఏల? ఏమి విశేషము.

మొదటి (శివతారవాసి)—ప్రభూ! రాజు బావ మఱది చం డపాలుఁడు కొట్టు దెబ్బలు సహింప లేకున్నాము.



(శివతరాయ నాయకుఁడు, గణేశుఁడు ప్రవేశము)

గణేశ—బాబూ, నీ వాజ్ఞ నొసఁగుము! ఆ తులువ దండపాలుని హస్తదండమును పెఁగులాఁడి తీసికొని, వాఁడబ్బ నాతనికిఁ బూర్తిగ చవిఁజూపెద. సెలవిమ్ము!

ధనం—దెబ్బకా నిది, యెట్లు రుచించునో పూర్తిగ వారికిఁ జూప యత్నించిన మేలు. చుక్కాని తరంగముల నలుకుటకు కాదు, సరిగ నిలిచి యుండి వాని జయించుటకు.

రెండవ (శివ) అయిన మీ యభీష్టమేమి?

ధనం—తలనెత్తి కొనుము! ఏదియు నిన్ను హింసింపఁ జాలదని యనుకొనుము; హింసయే యంతమొందును.

మూఁడవ (శివ)—నన్ను నేదియు హింసింపఁ జాలదని చెప్పుట కష్టము.

ధనం.—మనలోని పరమ పురుషుఁడొక యగ్నిజ్వాల, తేజ మన్నిహింస ల దహింపఁ జేయును. స్థూల కాయము మోటు మొకము వంటిది. దెబ్బ తగిలిన నది యేడ్చుచుఁ బోవును.—నోళ్ళ నంతగా తెఱచుకొని నిలుచుంటిరేల? నా మాటలు తెలిసి కొనలేరా!

రెండవ (శివ)—బాబూ, మిమ్ముల తెలిసి కొంటిమి! మీ మాటల తెలిసి కొనక బోయిన నేమి లోపము?

ధనం.—అయిన, మీ మనస్థితికి మందు లేదు.

గణేశ—మాటల తెలిసి కొనుట కెంతయో కాలము పట్టున

లనగోరియుంటి, "నను బరీక్షించి చూడుము, దెబ్బలు నన్ను హిం సించునో, హింసింపవో" భీరువులతోడను, భీకరుల తోడను ఈ యాత్ర యందు నా పదవను నిడపను.

(తిరుగ పాడును)

గీ॥ ఇదిగో నాకడసారి పన్నిదము సుమ్మి
నీవె గెలుపొందెదో లేక నేనె గెలుచు
వాడనో యది మున్ముందు జూడనగును;
విపణులను వీధులను సమావేశములను
ఎల్ల చోటుల నవ్వుచు నెలమినుండు
నన్ను నేడ్పింప గలవో గాంచంగ వలయు!

అందఱు (కలిసి కేక వేయుదరు) సెబాస్, నాయనా! "నన్ను నేడ్పింప గలవో గానంగ వలయు!"

తాండవ (శివ)—మీ రెక్కటికిఁ బోవుచున్నారు?

ధనం—రాజుగారి యుత్సవమునకు.

3 (శివ) రాజుగారు చేయు నుత్సవము నీ కొఱకు గాదే. నీ వచటి కేల బోవలయును?

ధనం—రాజస్థానమున నా పేరెఱుక బడుటకు.

4 (శివ)—నీ వొక్కసారి దొరికిన, ఆ, అతఁడప్పుడే—నీ యుల్లిస్నటికి జరుగగూడదు!

ధనం—కానియ్యి వయ్యా! పూర్ణముగా గానిమ్ము!

1 (శివ)—గురోజీ! రాజునకు నీవు భయపడవు. కాని మే

మై అడలిపోదును.

ధనం—మీ రాజునికి హానిచేయ లోలోన దలఁచుచున్నారు కావననే యిట్టి భయము. నేనెన్నఁటికి హాని సేయఁగోరను. కావున నే భయపడను.

2 (శివ)—మేలు, మేలు! మేమును మీ వెంబడి వచ్చెదము!

3 (శివ)—సరే! మనము రాజస్థానమున కేగెదము.

ధనం—రాజు నేమడిగెదరు?

3 (శివ)—అడుగుట కేమి! అనేకములున్నవి. కాని యందేయు బడునది యేది యని సందేహము.

ధనం—రాజ్యము నేల యడుగరాదు!

3 (శివ)—అయ్యో, హాస్యముసేయు చున్నారు!

ధనం—ఎన్నఁటికి నట్లుగాదు! రాజ్యము రాజుది మాత్రమే యయి ప్రజలది కూడ గానియెడల, రాజ్యమొక్క పాదముపై నె గురుచుండ మీరు భయాపహులై వణఁక వలసినదే! కాని అట్టి స్థితికి దేవుఁడు సహితము కంటఁబడి పెట్టును. రాజు క్షేమము కొఱకే మీరు రాజ్యము నడుగ నగును.

2 (శివ)—అప్పుడు వారు మమ్ము ద్రొబ్బి వైచిన?

ధనం—మీ రడుగు దానిలో యదార్థమున్న యాత్రోష్టము తిరుగ రాజే యనుభవించును.

(పాడును)

ద్విపద॥ స్మరణకు రాదుగా పరమేశ నీవు

కరుణామయుల నీవు కడజేర్చు మాట।

నాయకులారా! మీ కిందున్న నిజము చెప్పవలెనా? వినుడు. సింహాసనము లోకేశునదని మీరు గుర్తింప కున్నంత కాలము, దానిని మీ రడుగుట నిష్ఫలమగును.

(తిరుగ పాడును)

ద్విపద॥ మమ్మేలుటకుఁ గని కారణమ్మున గాదె
గుమ్మము కడ రాగ మమ్ముల గాంచి
తలుపుల వేయుచుక్ ద్వారపాలకులు
వెలుపలనే మేము నిలుచుండ గాదు.

దౌవారికు లెట్లు మనల గుర్తింప వలయు? మన నొసటిపై రాజ చిహ్నము పరాగాచ్ఛాదితమయి యున్నది. మన హస్తములను ధీర పుష్ప నిదర్శనముల నేమియుఁ జూపలేము.

గీ॥ తిలక మిడితివి మాకు నీచేతులార
మరియు దానితో మానంపు మకుటమున్న;
కాని లజ్జ యాసయు సిగ్గు దాని బట్టి
మలిన హస్తముల జిక్కి మాసిపోయి
ప్రతి దినంబును నీయాజ్ఞ ప్రభను దగ్గు.

1 శివ — మీ రన్ని చెప్పినను, మీరు రాజస్థానమునకుఁ బోవ పోతు రేమో మేము గుర్తింప లేకున్నాము.

ధనం — కారణము నే దెల్పుదునా? ఈ విషయమై నా మనసు సందియ పడుచున్నది కాన.

శివ — ఏమి, తండ్రీ! అట్లంటిరి!

ధనం—ఈశ కేర్పాటులో, మీ రాజుగారు కలుకున్నంటి యుం
దరో, యీతని మెలకువ యంత మంచి పోవుటయే గాక, నన్ను గూ
డ దిగులాగుదురు. మిమ్ముల వీడి యెవ్వరను వెంబడింప లేని తా
వు లేగద.

1 శివ—రాజు మాత్రము మిమ్ముల సులభముగఁ బోనీయరు!

ధనం—పోనిచ్చుట కర్తఁడెవరు?

శివ—నిన్ను హింసించిన మే మూరకుండ లేము!

ధనం—ఈ నా దేహము నెవరికి నే నప్పగించితినో యాయనయే నా మూలమున హింస బడ నిష్టపడ, మీరును నెమ్మదిగ నుండవలె.

శివ—మేలు మేలు! సరే, నాయనా! మేమును వచ్చెదము, కానున్నది గానిమ్ము!

ధనం—నాకై మీ రిచట వేచియుండకుఁడు. ఇది పరస్థలము. ఈ ప్రాంత్యమును గూర్చి కొంత తెలియఁ జేసి కొనవలెను.

[ధనం. పోవును.]

1 శివ—ఈ యుత్తర కూట వాసుల ముఖములఁ జూడుము! సృష్టికర్త వీరిని జేయునప్పుడు పెద్ద మాంసపు పిండితో ప్రారంభించి సాంతముగ జేయ వ్యవధి లేకుండ నొప్పు!

2 శివ—వీరు త్రొడిగి కొనిన బిగువు దుస్తులఁ జూడు!

3 శివ—ఓయి! నీకు తెలియదా! వారిలో నున్న దినుసులయు బయటకుఁ బోకుండ బిగించి యుంచుటకు తామె మూట గట్టు కొందురు!

1 శివ—వారు పుట్టుక తోడనె కష్ట జీవులు. సంత సంతతము, లేవు స్థలములకు, వెంట వెంట బోవుచు జీవితముల గడపు

చున్నారు.

2 శివ——చెప్పకొనదగిన విజ్ఞాన మేమియు వారికి లేదు. ఇక వారి గ్రంథములో! వట్టి పనికి మాలినవి.

1 శివ——కేవలు మట్టివే! వాని పుటలపై జెదలు బారులు గట్టి ప్రాకు చున్నటు లుండును గా!

3 శివ——సె బాస్, ఏమి మాట! చెదలు! నిజముగ చెదలే? వారి విజ్ఞానమే అన్నింటి దుష్టనియములుగ గొరికి వేయుగా.

3 శివ——పుస్తకముల గూడ బెట్టుదు. హస్తములతోఁ బ్రాణముల దీసి వేయుదురు; పాత్రములతో మనసులను పాడు జేయుదురు.

2 శివ——ఎంత పాపము! వారి నీడను దాకిన మాత్రమున పాపము సోకు నని గురువుల వాకనికి. వానికిఁ గారణము దెలియునా?

3 శివ——చెప్పు మేమో.

2 శివ——దేవాసురులు సంద్రమును మథించి యమృతమును గొనిన పిమ్మట గొన్ని సుధాబిందువులు దివిజ కుంభముల నుండి భువికి వాలికెను. తదమృత సిక్తమృత్తికచే సృష్టింపఁబడె శివ తరాలోని ప్రథమ పురుషుఁడు. ఇఁక పాత్ర కూటములోని తొలి మానిసి యెవ్వనో, దేవతలు విడిచిన కుంభముల నచట నచట నంటియున్న సుధను రక్కసులు కాలికలతో ననుభవించి యేమూలనో పారవైచిన, ఆపాత్రలు భిన్నభిన్నములాయె. అతఁడా ముక్కలతో గూర్పఁబడెను. అందుచేతనే వారింత గట్టి అబ్బా, దేమిగోతి! ఎంత యెంగిలి!

3 శివ——ఇదంతయు నెక్కడ నేర్చితివయా?



2 శివ— మన గురువు గారి నుండియే!

3 శివ— గురువరా! (గౌరవ సూచకముగ శిరము వంచి) సత్య స్వరూపుఁడవు, నీకీ సత్యము వు—

[ఉత్తర కూట వాసుల గుంపు ప్రవేశము]

1 ఉత్త— కమ్మరి యగు విభూతి రాజుచే క్షత్రియునిగఁ బరిగ్రహింపఁ బడుట తప్ప, సర్వమును పోయిన జరిగెను.

2 ఉత్త— అది కేవలము గృహ సంబంధమయిన విషయము. మున్ముందు దానిపని బట్టెదము. ప్రస్తుతము మంగళ ధ్యానము గావింతము, "ఆస్థాన శిల్పి విభూతి చిరాయువు నొందుగాత!"

3 ఉత్త— క్షత్రియ యువకులతో వైశ్య సామగ్రి లనేకము చేసిన విభూతి! "విభూతికి చిరాయువగు గాక!"

1 ఉత్త— అల్లదె! శివ తార వాసులు కొందఱు.

2 ఉత్త— నీకేమి గుర్తు?

1 ఉత్త— చెవులగప్పు కుళ్ళాయి లవిగో! ఎంత వికారముగ నున్నారు! నెత్తిపై నడచుటచే పెరుగుట మానిరా యన్నట్లున్నారు.

2 ఉత్త— ఇన్ని రకముల కుళ్ళాయి లుండ వీరిట్టి దాని నేల గ్రహించిరో దేహమున చెవుల నుంచుట సృష్టికర్త తప్పిద మని తలంచి యుందురా?

1 ఉత్త— వారిలోని విలువయిన స్వల్ప జ్ఞానమును బయల్పోకుండ చెవులకు కట్ట వేసిరి.

3 ఉత్త—వెఱ్ఱిమొగమా, అటుగాదు! అంత కంటె, ప్రపంచ జ్ఞానము వారి లోనికిఁ బ్రవేశించి బాధింప కుండ జేయుటకయి యుండు.

1 ఉత్త—ఉత్తర కూటపు వాఁడెవఁడయిన చెవి నులుపు నను భయము వారి నావహించినది!

(అందరును నవ్వుదురు]

1 ఉత్త—ఓయీ! శివతార మూర్ఖులారా! ఏమి మీకథ?

3 ఉత్త—ఇది మా పండుగ దినమని యెఱుఁగరా? ఱేఁడ, మాతో పాటు అరచుఁడు—"ఆస్థాన శిల్పి విభూతికి చిరాయు వగుగాత!"

1 ఉత్త—మీ గొంతుక లెండి పోయినవా యేమి? బిగ్గఱగా కేక వేయుఁడు—"విభూతికి చిరాయువు ప్రాప్తించు గాక!"

గణేశ—"విభూతికి చిరాయు వగుగాత" యని మేమేల యరవవలెను? అతఁడే మొనర్చెను?

1 ఉత్తర—అదే వినరయ్యా! "అతఁడేమొనర్చెను?" ఈ ఘన వార్త యింకను వారికిఁ జేరనే లేదు! ఇదంతయు వారి కుళ్ళాయిల మహాత్మ్యము!

[ఉత్తరకూట వాసులు నవ్వుదురు]

3 ఉత్త—అతఁడేమి చేసెనా! ఇదిగో! మీరు ద్రాగటకు నీరాతని చేతిలో నున్నది! ఇఁక నేమి కావలె! దాని వదల కున్న నీటి యొద్దడిలో కప్ప లెండి పోయినట్లు మీరెండి పోదురు.

2 శివ—మా నీరు విభూతి చేతులలోనా! ఒక్కమారుగ నతఁ

***************************************

ఉత్త—వారి టోపీల మహాత్మ్యమది. వారు హితము వినక నాశన మందుదురు.

1 శివ—మేము నాశన మంద నొల్లము.

ఉత్త—శ్రావ్యముగా మాత్రమున్నది! మిమ్ముల కాపాడువా రెవరి?

గణేశ—మా స్వామి, మా బైరాగి ధనంజయుని నీవు చూడలేదా? ఆయన శరీర మొకటి యాలయమున నున్నది, మరియొకటి వెలుపల నున్నది.

3 ఉత్త—వినుఁడు. ఈవి టోపీల వాండ్రను వినుఁడు! వారి దుర్గతి నుండి యెవ్వరును తప్పింప లేరు.

(ఉత్తరకూట వాసులు పోదురు.)

(ధనంజయుఁడు ప్రవేశము.)

ధన—హీన మతులారా! యేమనుచుంటిరి? మిమ్ముల మృత్యువు నుండి దప్పింప నా చేనున్నదా? అట్లేని, మీరు ముమ్మాటికిని మృతులే!

గణే—విభూతి ముక్తధారా జలము నాపి వేసె నని యుత్తర కూటస్థు లనిరి.

ధనం—కట్టి నడ్డుగ గట్టి రనిరా?

గణేశ—అవును బాబూ!

ధనం—మీరు సరిగా వినలేదు!

గణేశ—అది విన (ప్రయోజనము) లేనిదే! మీ చెవులు న

వ్వింటి నా వద్దనే యిడితిరా? మీ యందరి కొఱకు చేసె విం వల యునా?

3. శివ— వినుట కే మున్నదని, తండ్రీ!

ధనం— అంతర్య మయినను, బాహ్య మయినను, తీవ్ర శ క్తిని వశపఱచు కొనుట స్వల్ప విషయమా?

గణే— కావచ్చును; కాని దీని మాట? నీటిని—

ధనం— అది వేఱు సంగతి. అట్లు జరుగ భైరవుఁడొన్నఁటికి సై పఁడు. నేబోయి యీ యుదంతమును సాంతముగా దెలిసి కొన వల యు. లోకములో ననేకు లనేక విధములుగా జెప్పుచుంద్రు. వాని విన కుండుట బ్రతుక కుండుటయే!

[ధనంజయుఁడు పోవును]

[శివతార వాసుఁడు మఱియొకఁడు ప్రవేశము.]

4. శివ— భీషణా, వార్తలేమి?

భీషణ— శివతారనుండి యువ రాజును తిరుగ రావించుకొ నిరి.

అందఱు— అసంభవము!

భీషణ— మీరు చేసెడి దేమి?

అందఱు— తిరుగ నాతని గొనిపోదుము.

భీషణ— ఎట్లు?

అందఱు— బలవంతమున.

భీషణ— రాజూర కుండునా?

అందఱు— ఆతని లెక్క పెట్టము.

[రణజిత్తు, మంత్రి, ప్రవేశము]

రణ— ఎవరినిరా, లక్ష్యపెట్టక పోతురు?

అందఱు— ఏలిన వారికి చిరాయు వగు గాక!

గణేశ— మీ కడ కొక విన్నపము చేయ వచ్చితిమి.

రణ— ఏ మది?

అందఱు— యువరాజు గారు మాకు కావలె.

రణ— మీ విన్నపము ముద్దుగా నున్నది; కోరిక స్వల్పముగానే యున్నది.

1, శివ— చిత్తము. శివతారకు మే మాతని తిరిగి కొంపోదుము.

రణ— కొంపోయి యుత్సాహముతో పన్నులు గట్టుట మరతురా?

అందఱు— ఏమి చేతుము? తిండిలేక మాడుచున్నాము.

రణ— మీ నాయకుఁ డెక్కడ?

2. శివ-(గణేశుని వైపు జూపుచు) ఇదుగో, మా నాయకుఁడు గణేశుఁడు.

రణ— ఇతఁడు కాఁడు! మీ బైరాగి యేడి?

గణేశ— అదే, వచ్చుచున్నారు.

[ధనంజయుఁడు ప్రవేశము]

రణ— వీరల పై మసల జేసిన వాఁడవు నీవు.

రణ— (శివతొరనాసులకు) మీ రందరు మీ పురమును జేరు డుం; బైరాగి యిచ్చటనే యుండును.

అందరు— వలదు, ఎంత మాత్రము వలదు బడదు.

[ పాడును ]

గీ॥ ఆగు మంచును నీ వంత యారవ నేల?
ఎంత నిర్బంధ పెట్టిన నంతయైన
దాటి జాలంగ నేర నీ ధర్మ మెపుడు
ఆగు నదియేని యది మాత్ర మాగ గలదు॥

రాజా! నిర్బంధము వలన నీవు దానిని బొంద లేవు. సర్వ ప్రదుండే సర్వ గ్రాహి. నీవు దురాశ చే గ్రహింపఁ జూచు నది యెల్ల తస్కరణమే. ఎవ్వనికి కయిన దాని విడనాడ వలసినదే.

[ పాడును ]

గీ॥ ఈవు పధించు శిక్షల హెచ్చుగాను
కఠినతయు మూర్ఖ చిత్తంబు గాన బడెడిఁ;
అనుభవించెడు వాఁడొక్కఁడగును సత్యము,
ఇవ్వ వగ్గిన దాని సహించు నతఁడు॥

రాజా! బలము నుపయోగించి పొందిన యీ ప్రపంచము నీ ప్రపంచ మగు కొనుట తప్పినది. నీవు దేనిని స్వేచ్ఛగా నుండ నిత్తువో యదె నీదే; కాని నీవు స్వాధీనము జేసికొన బ్రయత్నింతువు. దన్నది తప్పించు కొనును.



[ పాదును ]

గీ|| నీ మనో రాగమును బట్టి భూమి నెల్ల
నాట్య మాడించు చనెడు స్వప్నంబు వంద;
అట్టి కన్నుల కౌరవంగ నరయ గలవు
ఈ వెఱుకు గోనట్టి వ వెన్నో జరుగ.

రణ— ప్రధానీ! ఈ బైరాగిని చెఱసాల నుంచుము.

మంత్రి— దేవరా,— (ఆగును)

రణ— ఈ నా యాజ్ఞ నే క్షిప్రముగ లేవటు లున్నది?

మంత్రి—భీకర శిక్షాయంత్రము సిద్ధమయినది. దాని భయంకరత్వమును అతిశయింప బ్రయత్నింప నది తగును.

శివతార—దీని నెన్నటికి జరుగనీయము.

ధనం —నన్ను విడువ్రందు; నా మాట వినరందు! నన్ను విడిచి పోందు.

1 వ శివ—యువరాజుగారిని కూడ మాకు లేకుండ జేసితిరే?

2 శివ—మా కిద్దఱును లేకుండిన మాశక్తి ని భరించు వారెవరు?

ధన— నే జితుడను! నన్ను వెనుకకు పోనీకుందు.

అందఱు—ఎందుచేతను. తండ్రీ?

ధనం—నను పొందితిమని యానందించుటలో మిమ్ములనే మీరు కోల్పోతిరి. ఈ నష్టమును గూడ దీయుట నాతరముగాదు. నాకు సిగ్గు వచ్చుచున్నారు.

1 శివ—క్షమింపుఁడు! అట్టులనకుఁడు! మీ యాజ్ఞను నెర వేర్తుము.

ధనం—అట్టు లయిన నన్ను విడిచి పొండు.

2 శివ—మమ్ము విడిచి యెట్టుండ మీ మనసొప్పునా? మమ్ముల ప్రేమింపవా?

ధనం—ప్రేమచే మిము స్వాతంత్ర్యమం దుంచుట మేలా? ప్రేమచే మిము నులిమి వేయుట మేలా? పొండు! నను విడిచి పొండు!

2 శివ—సరే, బాబూ! మేము పోవుదుము గాని—

ధనం—'కాని' యేమి! తలలెత్తుకొని పొండు.

అందరు—చిత్తము, చిత్తము, ఇదే పోవుచున్నాము.

[మెల్లగ కదలిపోవుచుందురు.]

ధనం—అదియేనా పోవుట! పొండు, వేగముగ పొండు.

గణే—మీ యిష్టము. కాని మీ యూహాపోహలు మీ యాశలు మిమ్ములనే యంటియుండు నని నమ్ముఁడు.

(వారుపోదురు.)

రణ—బైరాగీ, ఏమి నీ యోచన? అంత మౌన మేల?

ధనం—రాజా, వారు నన్ను కలఁత బెట్టిరి.

రణ—ఎందుకయి కలఁత?

ధనం—మీ చండపాలుఁడే, దండముతోఁ జేయ లేక పోయినదాని నే జేసితి నని భయపడుచున్నాను.

✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝✝

రణ—అటు లనుకొనుటకు హేతువేమి?

ధనం—వారి యపాపములు యాశలను బలహీనపరిచితివని తలంచి నా లోన గర్వించితిని; కాని యీ రోజున నేనే వారి యపాపములను యాసలను బెరుగు కొంటి నని, చెప్పకీతి నా మోమున గొట్టినట్లు ప్రవర్తించిరి.

రణ—ఇదంతయు నెట్లు సంభవింప నయ్యెను?

ధనం—వారిని లేపిన గోలంది, వారి మతంబులు పరి పక్వ స్థితిని బొందక మరింత క్షీణించు చున్నవి.

ధనం—రభసావేశులనుగా జేయుటచే జనుల ఋణభారము తగ్గింప లేము. వారి దేవుని కంటెను నేను గొప్పవాని నని వారి నమ్మిక. అందుచే భగవంతునకు వారు సమర్పింప వలసిన విధి పూర్వక ఋణము నే గొట్టివేయ గలనట! ఆ నమ్మికతో వారు కన్నులు మూసికొని నన్ను బట్టుక వ్రేలాడు చున్నారు.

రణ—నిన్నా భగవంతుడనుకొనుచుంటి?

ధనం—కనుక నా యొద్దనే యాగిపోయి, దైవము నెన్నటికి జేరరు. వెలుపలినుండి వారిని బలవంత పెట్టుటచే నేను, లోపలినుండి లిన్నగ నడిపించు భగవంతుని గప్పి పుచ్చితి.

రణ—రాజునకు జెల్లింప వలసిన పన్నుల కట్టకుండ నాప్రదము; భగవంతున కర్పింప వలసిన దాని నీ కొసంగిన నీవు నీ మనంబులో బాధ జెంద కుందువా?

ధనం—సందియ మేమి? బాధ పడుచునే యున్నాను. భూమిలోనికి కుంగి పోవుచున్నట్లున్నాను. వారు ప్రజల నన్నింటిని నాకె యర్పించుటచే కృతార్థమనస్కులయిరి. వారి ఋణ విముక్తులఁ జేయు బాధ్యత నాదగును; నే నట్టి బాధ్యతనుండి తప్పించుకొనలేను.

రణ—ఇప్పుడేమి చేయుట ధర్మమని నీకు తోచును?

ధనం—వారినుండి తొలఁగి దూరముగ నుండుట. వారి మనోవ్యాకులతకు నడ్డకట్టఁ గట్టుటయే నిజమగున, మీ విభూతిని నన్ను నొక్కసారియె భైరవస్వామి శిక్షించును గద.

రణ—అయిన తప్పేల? ముందునకు పోఁగూడదా (యుద్ధవునితో) ఈ బైరాగిని నా గుడారమునకుఁ గొంపోయి యచ్చట నుంచుము.

(యుద్ధవుఁడు ధనంజయుని గొంపోవును.)

రణ—మంత్రీ! తక్షణ గృహములోనికిఁ బోయి యభిజిత్తును జూడుము. పశ్చాత్తాప పడుచున్నటు లున్న యెడల—

మంత్రి—స్వామీ, ఇంతకంటె బాగుండునది, మీరే స్వయముగ—

రణ—ఏమి? ఏమి? వాఁడు స్వజనుల పట్లనే ద్రోహి. తన తప్పు నొప్పుకొను వఱకు వాని మొగము జూడను. నే నగరునకు మరలుచున్నాను. వాని నచ్చటికిఁ బంపుము.

(రాజు నిష్క్రమించును.)



(పాడుచు నగ్నచకులు బయివెళింతురు)

(పాట)

తిమిర హృద్విదారణ
జ్వాల దగ్ధ నిదారుణ
మరు శ్మశాన సంచర
శంకర శంకర
వజ్ర ఘోష వాణీ
రుద్ర శూల పాణీ
మృత్యు సింధు సంతర
శంకర శంకర.

[వారు నిష్క్రమింతురు.)



# ముక్తధార

—:o:—

(యుద్ధవుఁడు పు॥ ప్రవేశము)

యుద్ధ—ఏమిది? రాజుగారు యువరాజును జూడకుండ పోవుట!

మంత్రి—తన మనో నిశ్చయమునకు భంగము వాటిల్లునని భయపడెను. అతని మనం బీ సందిగ్ధ స్థితినుంట చేత నే బైరాగితో సంభాషణ సాగించు చుండెను. గుడారమును జొచ్చుటయూ, గుడారము వదలి వచ్చుటయూ, యని నిశ్చయించు కొనలేక పోయెను. నేఁబోయి యువరాజును జూడవలెను.

[ఇద్దఱును పోదురు.]

[ఉత్తర కూటస్థులు కొందఱు ప్రవేశము]

1 ఉత్త—మనము దృఢ చిత్తులమై యుండవలయు. రాజు నొద్దకు బోవుదము రండు.

2 ఉత్త—అటు జేసిన లాభమేమి? యువరాజాయనకు ప్రాణసముఁడు. ఆయన నెన్నఁటికి మనము గ్రహింపలేము. ఆయన మనపై యాగ్రహించును.

1 ఉత్త—అయిన నేమి? మన మనంబుల నించుక యాతనికెఱిఁగింపవలెను; పిమ్మట నేమి జరిగిన జరుగనిమ్ము. యువరాజు మనపై ప్రేమనింత చక్కఁగ వెల్లడి జేసి నందుల కిదియా ఫలము? ఉ

దుముకి వచ్చును. కాని, యీ శూన్య ప్రదేశమును గూడ నిష్ఫపదర ని నేనొక్క చెప్పగలను.

3 ఉత్త—కనుక, మనము పోయి రాచ నగరున కెదుట నిలువఁ బడి, రాజునకు చిరాయువగు గాక, యని యఱచెదము.

1 ఉత్త—అటు జూడు! సూర్యుఁడు గ్రుంకె; ఆకసమున చీఁకటి పర్వుచున్నది. కాని విభూతి గావించిన యంత్ర నిర్మాణ మిఁకను మెఱయు చున్నది. సురాపానముచే నెఱ్ఱ వడిన చందమున దోఁచుచున్నది.

2 ఉత్త—అస్తమింప నున్న వెలుతురు యొక్క తుదికిరణము, ఆ త్రిశూలముపై నుద్వహింపఁ బడినది. అదియొక రీతి-దాని వర్ణింపఁ జాలకున్నాను.

[ఉత్తరకూట వాసులు పోవుదురు]

మంత్రి—ఇప్పుడు తెలిసినది; తన విడిది లోనే రాజు యువ రాజును ఖయిదు చేసి యుంచుటకుఁ గారణము.

యుద్ధ—ఏమి యా కారణము?

మంత్రి—తన దేశఁపు బ్రజల హస్తముల నుండి దప్పించుటకు. కాని, సర్వమును సరళి దప్పినట్లు కనఁబడుచున్నది. క్షణ క్షణము యా వేశ మతిశయించుచున్నది.

[సంజయుఁడు ప్రవేశము]

సంజ—నా యాత్రలను రాజువద్దఁ జూపు వెలుచుచున్నాను. ఏ ల్లపానన నాలినిన్ని సన్నకల్పము ధానివలన సెక్కుడు దృఢ పడునేమొ.

మంత్రి—రాజనందనా, నీ పూర్వక యాదుటకు యత్నింతు

ము. ఇప్పుడున్న చిక్కులే చాలును. క్రొత్త వానిని తెచ్చి పెట్టకుము.

సంజ—ప్రజలతో మాటాడ బోతిని. వారు యువరాజును ప్రాణము కంటె యెక్కువ ప్రేమింతురని నే నెఱుఁగుదును. అతఁడు ఖయిదునుండుట వారు సహింపఁజాలరు. కాని, అతఁడు వంది ద్వారమున దెలిచె నను వార్త విని కోపానల దందహ్యమానులయి నట్లు నే గుర్తించితి.

మంత్రి—ఇట్టి యెడల ఖయిదు మంచుటయే యాతనికి శ్రేయోదాయక మని యెంచవలెను.

సంజ—బాల్యము నుండి నే నాతని నెల్లప్పుడు ననుసరించి యుంటి. ఖయిదులోనికి గూడ ననుసరించెద.

మంత్రి—దానఁ బ్రయోజన మేమి?

సంజ—ఒక్కొక్కఁడుఁ దనంతట దా నర్ధమానవుఁడే. అన్యునొకని దృఢముగాఁ జేసినప్పుడె యాతఁడు సంపూర్ణత గనును. యువరాజును జేరుటలో రాజ సాంగత్యమున సంపూర్ణతఁ గంటిని.

మంత్రి—ఇట్టి పొందు యదార్థ సాంగత్యమైన పట్టున, కేవల బాహ్య సమావేశ మనవసరము. అంబరము నందలి యంబుదమును, అంబుధి యందలి యంబువును యదార్థముచే నొకటియె; అవెంత దూరమున నున్న నేమి? యువరాజు లేని తావుల నీమూలమున నాతఁడు విదితము కావలసియున్నాఁడు.

సంజ—ఇవి నీ సొంత పలుకుల వలె దోచవు యువరాజు మాటల వలె విన నగుచున్నవి.

*****************************************

యుద్ధ—కాని, అట్లు చేసిన వాని, రాజెప్పటికిని క్షమింపఁడు.

విశ్వ—నా సైనికులు నిన్ను నీ రక్షకులను బట్టుదురు. ఆ బాధ్యత నాది.

[బయటనుండి కేకలు; అగ్ని! అగ్ని!]

యుద్ధ—అల్లదిగో! రక్షకులుండు గది యొద్ద నున్న వంటలు జేయు గుడారమున కగ్గి నంటించిరి. ధనంజయుని యువరాజును కారాగార విముక్తులఁ జేయుట కిదియ యదను.

[అతఁడు పోవును; కొంత సేపటికి అభిజిత్తు ప్రవేశము.]

అభి—(విశ్వజిత్తుతో) ఇక్కడే నుంటి వేల?

విశ్వ—నిన్ను బట్టుకొన వచ్చియుంటి. నీవు మోహన గిరికి రావలసియున్నది.

అభి—నేఁడు నన్నెవియు బంధించ లేదు,-అగ్రహముగా నిమ్ము అనుగ్రహము కానిమ్ము. గుడారమునకు నిప్పు నంటించిన వారలు మీరని గదా మీ యూహ? అట్లు కాదు! ఈ అగ్ని నాకై వేచియున్నది. చెఱయం దుండుటకు గడువు నాకు లేక పోయెను.

విశ్వ—ఏమి, నాయనా! నీవు చేయ వలసిన పని యేమి?

అభి—నా పుట్టువు తోడఁ బ్రాప్తించిన ఋణము నే దీర్చవలెను. ముక్తధారా ప్రవాహము నన్ను పుట్టుక తోడనె దాది వలె పెంచినది; దానికి నే స్వేచ్ఛ నొసఁగ వలెను.

విశ్వ—ఈ దినమున గాదు. అట్లు చేయుటకు కావలసినంత కాల మున్నది.

* * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * * *

అభి — నాకు తెలిసినదది. అట్టి కాలము తిరిగి ఎన్నడు వచ్చునో యెవ రెఱుఁగుదురు.

విశ్వ — మేమును నిన్ను జేరెదము.

అభి — కాదు; ఆ కృత్యము నేఁ జేయవలసినది; మీ కందు సంబంధము లేదు.

విశ్వ — నిన్ను ప్రేమించు శివతరై వాసు లీ పనియందు నీకుఁ దోడ్పడ నుద్యుక్తులయి యున్నారు. — అట్టివారిని నీ వెంటఁ బిలువవా?

అభి — నాకు వచ్చిన సందేశము వారికిని వచ్చిన దాఁక వారు కనిపెట్టుకొని కూరుచుండరు. ఆ సందేశము వారిని తప్పు త్రోవను బడఁజేయును.

విశ్వ — చీఁకటి పడుచున్నది, నాయనా!

అభి — సందేశము వచ్చిన దిశనుండి వెలుతురు వచ్చుచున్నది.

విశ్వ — నీ పక్షమునుండి నిన్ను త్రిప్పు శక్తి నాకు లేదు. నీ వంధకారమున నిమగ్నుఁడ వగుచున్నను, దేవుఁడు నిన్ను పరిరక్షించునని నమ్ముచున్నాను. నిన్ను భగవంతుని చేతులలో విడచెదను. ఆశాభరితమగు నొక్క నుడువును నా చెవిఁబడఁ జేయుము. తిరిగి మనము కలసి కొందుమను మాట చెప్పుము.

అభి — ఒక్కటి జ్ఞాపక ముంచుకొనుము; మన మెప్పటికిని వేఱు పడఁజాలము.

[వారెదురు దిశల బోవుదురు.]

# ముక్తధార

—:o:—

[వటుఁడు, ధనంజయుఁడు, ప్రవేశము.]

వటు—తండ్రీ, దిన మంత్యమయినది; చీఁకటి క్రమ్ముచున్నది.

ధనం—తనయా, మన వెలుపలి వెల్తురు నాధారము చేసికొని యుండుటకు మనమల వడితిమి; అందుచే చీఁకటి బడినపుడు మనము కాన లేకున్నాము.

వటు—భైరవ స్వామి యీ దినమున నృత్యము చేయఁ బ్రారంభించునని తలఁచి యుంటిని. కాని శిల్పియగు విభూతి తన యంత్రముచే నాయన కాలు సేతుల గట్టి వేసెనా యేమి?

ధనం—భైరవుఁడు నృత్యము జేయ ప్రారంభించునది మన కగోచరము. అది యంత మొందునపుడె ప్రకటితమగును.

వటు—మాకు ధైర్యముఁ జెప్పుము. గురూత్తమా, మాకు భయమగుచున్నది! మేల్కొనుము, భైరవా! మేల్కొనుము! వెలుతురు పోయినది! దారి కాన్పించుట లేదు! ప్రతి వచనము విఫలమగుచున్నది! ప్రాణ వినాశక! ఇంకను భీకర తరమయిన దానిచే మా భయము నశింపఁ జేయుము!

భైరవా, మేల్కొంచుము! మేల్కొంచుము! [వెళ్ళును.

[ఉత్తరకూటపు జనులు ప్రవేశము.]

1 ఉత్త—అబద్ధము! అతఁడు చెఱసాలలో లేఁడు! వారెక్కడనో యాతని దాఁచి యుంచిరి.

2 ఉత్త—వాళ్లు గాంచ గల్గుదుమో చూతము.

ధనంజ—లేరు, లేరు! వారెన్నటికిని గాంచి యుండ లేరు. గోడలు విరిగి పడును; ద్వారము ముక్కలయి పోవును. చీకటి కోణము లోనికి వెలుతురు చొచ్చును; సర్వమును స్పష్టపడును.

1 ఉత్త—ఎవరిది? నన్నింతే భయపెట్టినాఁడు?

3 ఉత్త—ఇది యంతయు బాగుగ నున్నది! మన మెవరినో యొకరిని హింసింప వలెను. ఈ బైరాగి బాగుగ బంకె వచ్చును. ఆతని బంధించుము!

ధనంజ—ఎప్పుడును తనకుఁ దానె వశుఁడై యున్న వానిని బట్టుట వలనఁ బ్రయోజన మేమి?

1 ఉత్త—నీ వైరాగ్యమును వెనుకఁ బెట్టెదము. మేము నీ యనుచరులము గాము.

ధనం—మీ రదృష్టవంతులు! గురువు ననుసరించి గురువును గోల్పోయిన నిర్భాగ్యులను గొందఱ నే నెఱుఁగుదును.

1 ఉత్త—ఎవరు వారి గురువు?

ధనం—ఎవని వలన వారు దెబ్బలుఁ గొను చున్నారో, యతఁడే నిజమయిన గురువు.

[ అప్రకాశుఁడు పాడుచుఁ బ్రవేశించును. ]

తిమిర హృద్విదారణ
జ్వలదగ్ని నిదారుణ
మరుశ్మశాన సంచర

2 ఉత్త—మిత్రమా! దీనికిఁ దగిన పని యేమనిన—నీకుఁ దెలిసి నదా?

1 ఉత్త—ఆఁ, అవును! అతని రాష్ట్రములో నున్న సంవర్ణ ఖని—

3 ఉత్త—అతని కోట్టములో కనీసము, యేఁబది వేల పశువులు న్నవని నమ్మకమయిన తావు నుండి వింటిని. ప్రతి పశువును నొక్కొకటిగ నెంచి వానిని స్వాధీన పఱచు కొనెదము. ఎంత దుర్భరాము!

4 ఉత్త—అదియుంగాక, వతనికి కాశ్మీర వనము నుండి వచ్చు సంవత్సరాదాయము అగుమ పక్షము—

2 ఉత్త—అవునవును! వాని రాష్ట్రముచే దాని గ్రక్కించవలె ను. ఎంతటి తిరస్కారము!

1 ఉత్త—రండు! రాజునకీవిషయము గూర్చి తెలియఁజేయుదము.

[అందఱు నిష్క్రమింతురు]

[ఒక పాంథుఁడఱచుచుఁ బ్రవేశించును]

మొదటి పాంథుఁడు—బుడాస్! శంభూ! బుడా—అన్! శంభూ—ఊ—ఊ! అబ్బ! ప్రాణము విసిగి పోవుచున్నది! అద్ద్రోవను వచ్చి నన్ను గలసి కొందుమని చెప్పుచు వారు నన్ను ముందుగ బంపిరి. కాని వారి జాడయే లేదు—(పైకిఁ జూచుచు) అమ్మ య్యో! ఆ పైని నల్లని యినుప పిశాచము! నన్ను జూచి వెక్కిరించు చున్నది! నన్ను భయకంపితునిగఁ జేయుచున్నదే!



[ మఱియొక పాంథుడు ప్రవేశము ]

ఎవరచట? పలుక వేల? బుడాన్!

రెండవ పాంథుడు—నన్ను నిముకుడందురు; ప్రమిదలనమ్ము వాఁడ. నేఁడు రాజధానియందు రేయంతయు నుత్సవము గాన ప్రమిదలు కావలసి యుండును. నీ వెవరవు?

మొదటి పాం—నా పేరు హుబ్బా. గ్రామముల వెంబడి సంచారము చేయు వేష గాంధ్ర మేళము లోని వాఁడను. నీ త్రోవలో మా మేళమును జూచితివా? అందు, అను మానాయకుఁ డగపడెనా?

నిముకుఁడు—ప్రజలు తండోప తండములుగ వచ్చుచున్నారు, వాని గుర్తింప నా కెట్లు సాధ్యము?

హుబ్బా—మా అందు సాధారణుఁడు కాఁడు. కేవలము సంపూర్ణ మానవుఁడు. గుంపులో నతని నాన వాలు బట్టుటకు సంలోచన మా లవసరము లేదు. ఆతఁడు తునియ యనుకొంటివా? కాదు, కాదు—ఏమోయి! నీ వద్ద గంపలో నెంత ప్రమిదల నరకున్నది? నా కొక్కటియవా? ఇంటనున్న వారి కంటె వీధియున్న వారికి దీపపు టవసర మెక్కువ.

నిముకుఁడు—ఎంత విలువ నిచ్చెదవు?

హుబ్బా—ఇయ్య గలిగి యున్న యెడల, నిన్ను బిగ్గరగ నాక్షాపించి యుండును గాని, నా కోమల గాత్రమును నీ పై వ్యర్థ పుచ్చుదునా!

నిముకుఁడు—హాస్యగాని వలె నున్నావే!

[పోవును.]

********************. ***************************

ము. బాబు వా వారము. ( ఒక్క త్రోపు త్రోయును ) ఇప్పుడు తెలిసిందా?

హుంబ్యా—ఆఁ! ఔను! దీని యాథార్థము మాత్రములో నే మరి, నే బోయి తీరవలెను, ఇష్టమయినను, కాక పోయినను, కాని, ఎక్కడనో? దయచేసి మీ జవాబు నీ పర్యాయము కొంచెము మెల్లగ నెమ్మదిగా నిండు. మీ మొదటి మాటల త్రోపు నా మనస్సును చాల వఱకు నిర్మలము గావించినది.

దండు—నీవు శివతారకుఁ బోవలసి యున్నది.

హుంబ్యా—శివతారకే! ఈ చీఁకటి రేయినా! అక్కడియాట యేకథను?

దండు—ఏ కథనా? నంది ద్వార దుర్గమును తిరిగి కట్టుట.

హుంబ్యా—నా సాయము చే దుర్గమును దిరుగ కట్టనెంచితివా? అయ్యో! మిత్రమా, ఈ యంధకారమున నాపై నీ దృష్టి సరిగ ప్రానకుంట చేతనే నీ విట్టి యసంభవము నుచ్చరించితివి! నేను—

దండు—నీ తెలివియున నా కేమి? నీకు రెండు చేతులున్నవి.

హుంబ్యా—అందుకు నే నేమియు చేయ లేక పోతిని, కాని వీటి నటుట—

దండు—నీ చేతుల యుపయోగపడునని నిర్ధారణ నీ నోటి వెంబడి కాదు. సమయము వచ్చినప్పుడు మేమె కనుగొందుము. ఇఁక రమ్ము.

[దండు కూర్చొన్నాఁడిక నొకఁడు ప్రవేశము]

2 దండు—ఇచట నొకఁడున్నాఁడు, కంకరా

*************************************

కంకరుఁడు — ఎవఁడువాఁడు

పాంథుఁడు:— నేనెవరును కానయ్యా! నాపేరు లక్ష్మణుఁడు, భైరవాలయములో జయ ఘంట మ్రోగించువాఁడను

కంకరుఁడు__అటయిన నీచేతులు గట్టివే శివశారకు రమ్ము!

లక్ష్మ—అయితే ఘంట మాట?

కంక — భైరవుఁడు తనఘంటను తానె మ్రోగించుకొనును.

లక్ష్మ—మ్రొక్కెదను! నన్ను దయను జూడుఁడు! నా భార్యకు జబ్బుగా నున్నది.

కంక——నీవు లేకున్న నేమి? ఆమె జబ్బు కుదురును; లేకున్న నామె మృతి నొందును. నీ వింట నున్నను నదియే జరుగును.

పులబ్బా—ఓయి వెఱ్ఱివాఁడా, లక్ష్మణా! గడబిడ చేయకుము. పనిలో ప్రమాదము లేక పోలేదు, నే నెఱుఁగుదును. కాని నీవు దాని కడ్డుజెప్పటలో కూడ ప్రమాదమున్నది; అప్పుడే నేనుదాని కొంత రుచి చూఁచితిని.

కంకర—అదిగో వినుము! నరసింగుని మాటవలె నున్నది.

[ గుంపుతో నరసింగుఁడు ప్రవేశము. ]

కంకర—శుభ మేనా వర్తమానము; నరసింగా?

నరసింగు__మనపనికై వీరిని పోఁగుఁజేసితిని. మఱికొంత మంది నప్పుడే పంపివేసితి.

గుంపులో నొకఁడు—నేను వెళ్ళను.

కంకర—ఎల? నీ యసందర్భ మేమి?

***************************************

ఒకడు—ఏమియు లేదు. కాని నే వెళ్ళుటలేదు.

శంకరు—వీని పేరేమి, నరసింగా?

నరసింగు—ఈతని పేరు వనవారి. తామర గింజల నుండి జపమునకై పూసలఁ జేయును.

శంకరు—వాని సంగతి నేను కనుగొన నిమ్ము (వనవారితో) నీ కేల వెళ్ళుట కిష్టము లేదు!

వనవారి—శివతారవాసులతో నాకు కలహము లేదు. వారు మనకు విరోధులు కారు.

శంకరు—కాని, మనమే వారి విరోధుల మనుకొనుము! దానిలో మాత్రము మనకు బాధ్యతలేదా?

వనవారి—ద్రోహముఁ జేయుటలోఁ బాల్గొనుట నా కిష్టము.

శంకర—న్యాయనిరూపణ స్వాతంత్ర్యము నీ కున్న గదా లెప్ప తప్పు కాగలదు. ఉత్తరకూటస్థులెల్లరు, నొక గొప్పసంఘము. అందు నీ వొక భాగము. సంఘములో నొకఁడ వగుటచే నీ వేమి చేసినను, దానికి నీవు బాధ్యుఁడవు కావు.

వనవారి—అంతకంటె గొప్ప సంఘ మొకటి యున్నది. అందు ఉత్తరకూటము శివతారయు గూడ భాగములే.

శంకర—ఓయి, నరసింగా! వీఁడు వాదించుచున్నాఁడే! వాదించు వాని కంటె దేశమున కరిష్టకారి లేఁడు!

నరసింగ—కఠినమైన పని చేయించుట యే దానికి మందు! అందు చేతనే వానిని మాతో గొనిపోవుచున్నాము.

ధనవారి— నా వలన మీకు శ్రమయే కాని, మీపనికి నే నే మియు సహాయోగించను.

శంకర—నీ వృత్తాంత మాటమునకే శ్రమ నిచ్చుచున్నాడ. అందుచే నిన్ను వదల్చు కొనఁ జూచుచున్నాము.

హుబ్బా—ఓయి బన్వారీ, ప్రియ మిత్రమా! నీవు వివేకవ ముగ ఉత్తర వారి తెగలోని వాఁడవు వలె నున్నావు; బలవంతు లగు వారి తెగ యొకటి గలదని నీవు గమనించవ పున్నావు. ఈ రెండు తెగలవారును పొసఁగ కుండును! వారి పద్ధతిని నీవు నేర్చుకొనవలెను, లేక నీ పద్ధతిని విడచి యూరకుండవలెను.

ధనవారి—నీ పద్ధతి యేమి?

హుబ్బా—నాకు పాట పాడుట వాడుక. కాని అది యిప్పుడు నిరుపయోగమని యూరక యున్నాను.

శంకర—( ధనవారితో ) ఈ సందర్భమున నీ వేమి చేయుదువో తెలుపుము.

ధనవారి—ఇఁక నొక అడుగయినను ముందు వేయను.

శంకర—హో, అలాగునా! అయిన మేమే నిన్ను కదలునట్లు చేయుదుము. ఎవరక్కడ! వీని నీ త్రాటితోఁ గట్టి వేయుఁడు.

హుబ్బా—( అడ్డువచ్చి) అయ్యా, అయ్యా! దయచేసి నా దొక మాట వినుఁడు, నా కొప్పగించుకుఁడు! ఈతని మోసికొని పోవుటకు వృథ పఱచవలసిన శక్తిని బాగుగ వినియోగించుటకు తరిణము గలదు.

స్న మాట.

[ తెర వెనుక నుండి ధ్వని ]

భైరవా, భైరవా, లెమ్ము.

(ధనంజయుఁడు ప్రవేశము)

శంకరు—సాహస కృత్యమునకు పాల్పడియున్న యిట్టి తరుణమున మన కిది యొక దుశ్శకునము.

విభూతి—బైరాగీ, నీవంటి సన్న్యాసులిది వఱకెన్నఁడును భైరవు మేల్కొలుప లేక పోయిరి. కాని నీవు భక్తిహీను లగుటచే నా వంటి మనుజులు భైరవుని గట్టిగ లేపఁబోవు చున్నారు.

ధనం—ఆయనను లేపుట మీకుఁ గాదని నే చెప్ప దనుకొన లేదు.

విభూతి—మేము మేల్కొలుపు పద్ధతి జయ ఘంటల మ్రోగించుటయు దీపముల వెలిగించుటయు కావు.

ధనం—కాదు! మీ రాయనను సంకెలలతో బంధించినపుడు వానిని త్రెంపి వేయుటకు మేల్కొనును.

విభూ—మేము వేయు సంకెలలఁ ద్రెంప సులభము గాదు. పాపములు లెక్క లేకుండ నున్నవి; అట్టి సంకెలలు ముళ్ళును లెక్క లేనన్ని గలవు.

ధనం—ఆ టంకము దాఁట నశక్య మయినపుడు, ఆతఁడు లేచు సమయము వచ్చును.

తుఫ్రచే వారు మిక్కిలి యాతురత జెంది, ఆనందము కనఁబడిన యొకల మీ తీర్పునకై వేచి యుండు నట్లుండిరి.

విభూతి—మా యంతట మేమె నంది దుర్గమును గట్టి ప్రాను కొంటిమి.

గణ—ఆ పనిని నా కయి యేల విడువ లేదు?

విభూతి—యువ రాజు గావించిన యీ దారుణ కృత్యమున కు మీరు రహస్యముగ నుత్తరువు పాలించితి రని మే మనుమానింప మా కధికారము గలదు.

మంత్రి—అయ్యా! ఒక దెస స్వోత్కర్ష చేతను ఇంకొ నొక దెస క్రోధా టోపము చేతను ప్రజల మనంబు కలఁతఁ జెందినది. నీ యాతురత వలన వారి యా తురతను వృద్ధి జేసి వాని యుద్రేకమును మరింత హెంపు జేయకుము.

గణ—ఎవఁడక్కఁడ? ధనంజయుఁడా?

ధనం—తమరు నన్ను మఱచి పోనందులకు సంతసించుచు న్నాను.

గణ—అభిజిత్తు ఎచట నున్నాఁడో నీవు నిశ్చయముగ నెఱుఁగుదువు.

ధనం—నాకు యథార్థముగఁ దెలిసిన దాని నేను రహస్యముగ నుంచను.

గణ—అయ్యో! నీ విచట నేమి చేయుచున్నావు?

ధనం—యువరాజు దర్శనమునకై వేచి యున్నాను.

[బయట నుండి అంబగొంతుక వినఁబడును.]

మామా! సుమనా! నాథునా! చీఁకటి పడినది! [illegible]

పిల్చు!

రణ—ఎవరా పిలుచు చున్నవారు?

మంత్రి—అదె యాపిచ్చి మానిని యంబ.

(అంబ ప్రవేశము.)

అంబ—వాడింకను తిరిగి రాలేదు

రణ—నీ వాతని నేల వెదకెదవు? కాలము వచ్చి యుండెను; భైరవుడు పిలుచుకొని పోయెను.

అంబ—భైరవుఁడు పిలుచుకొని పోవుట యేనా? ఎన్నఁటికిని తిరుగ బంపరాని మహాపాపముగా నయిన దీ శిక్ష మందయునా? నా సుమనా! [అంబ నిష్క్రమించును.]

[వార్తా వహుఁడు ప్రవేశము]

వార్తా—శివతారనుండి జన సమూహ మొకటి దాడి వచ్చుచున్నది.

విభూతి—అ దెట్లు సంభవించెను? ఆకస్మికముగా వారిపైఁబడి వారిని నిరాయుధులుగఁ జేయ నుపాయము పన్నితిమి. మనలో ఎవఁడైన నొక ద్రోహి యుండనోపు! శంకరా! నీ గుంపులోని వారు తప్ప పరు లెవ్వరు నెఱుఁగరే; ఎట్లు?

శంకరు—విభూతీ! మమ్ములను నీ వనుమానించెదవా!

విభూతి—అనుమానమునకు మేర లేదు.

శంకర—అయిన, మేముగూడ నీపై ననుమాన పడెదము.

విభూతి—అందుకు మీ కధికారమున్నది! కాని సమయము వచ్చినపుడు దన్నియు పరిష్కరింపఁబడును.

రణ (వార్తావహునితో) వారెందులకు వచ్చుచున్నారో నీ వెఱుఁగుదువా?

వార్తా—యువరాజు ఖైదులో నున్నాఁడని విని, వారాయనను వెదకి విముక్తుని గావింప వచ్చుచున్నారు.

విభూతి—వాఁని వలెనే మేమును అతని వెదకుచున్నాము. ఎవ రాతని కనుగొన గలరో చూతము!

ధనం—శత్రువులును ఆతని కనుగొనఁ గలరు. ఆతనికి ప్రియు లెవ్వరును లేరు.

వార్తా—శివ తార ప్రజా నాయకుఁడు గణేశుఁ డడిగో వచ్చుచున్నాఁడు.

[ గణేశుఁడు ప్రవేశము ]

గణే—(ధనంజయునితో) తండ్రీ! అతని మేము కనుగొందుమా?

ధనం—ఆఁ.

గణే—మాకు వాగ్దానమును గావింపుము!

ధనం—తప్పక మీ రాతని కనుగొందురు.

రణ—మీ రెవరి కొఱకు వెదకుచున్నారు?

గణే—రాజా! నీ వాయనను విడచి వేయవలెను.

రణ—ఎవరిని?

గణే—మా యువ రాజును! ఆయన మా రక్షకుఁడు. మాకు కావలెను! మాకు ప్రాణాధారమైన వాని నన్నింటిని—ఆయనను గూడ—నీవు బంధించెదవా?

రణ—అవును, ఇది వాని పనియే!

మంత్రి—ఇంకెవ్వరియును గాదీపని; ఇది యాతనిదే—

రణ—అతనంతటి ధైర్యశాలి యెవఁడు?

ధనం—(పాడును)

ద్విపద॥ త్రిదు మంజీరముల్ చెలఁగి మ్రోగఁగ

పాదు జీవిత మందు నాట్య మాడెదును.

రణ—నే శిక్షించెదను; అతడు శిక్షార్హుఁడయిన యెడలఁ గాని, ఈ జనులు కోపముచే నొంద లెఱుంగక,—అయ్యో, నా అభిజిత్తు! దేవతలచే కటాక్షింపఁ బడిన వాఁడు! దేవతలాతని రక్షించెదరు గాక

సైని—ఏమి జరిగినదో నే గ్రహింపకున్నాను, ప్రభూ!

ధనం—(పాడును)

ద్వి॥ కాచుచుండును రేయికడు శ్రద్ధతోడ

కాచు వానికి గూడ కావలియుండు;

వినుము విస్మయ మని మింట మెరయు తారలును

ఘనభీతి చేతను గడగడ వడకు.

రణ—అదిగో; అడుగుల చప్పుడు వినవచ్చుచున్నది! అభిజిత్తూ? అభిజిత్తూ!

మంత్రి—ఆ వచ్చుచున్న వాఁడతఁడే కావచ్చు.

ధన—(పాడును) ద్విపద॥ పగలు గుండెలు నావి వ్రక్కలై

వ్రక్కలుగ

తెగసంకెలలు వీడి ధరణిపైఁ బడగ

[సంజయుఁడు ప్రవేశము]

రణ—అదే సంజయుఁడు వచ్చుచున్నాఁడు! అభిజిత్తు రాలేదా?

సంజ—ముక్తధారా జలపాత మతని తీసుకపోయినది. మన వాఁడు లేఁడు.

రణ—ఏమి చెప్పెదవు, కుమారా?

సంజ—కట్ట బంధము తెగఁగొట్టెను.

రణ—ఆఁ వాఁడుఁ దలిచె! అందు మూలమున వాఁడున్ స్వేచ్ఛఁగాంచెను. సంజయా! అతఁడు వెంబడి నిన్ను తీసుకపోయెనా?

సంజ—లేదు! కాని, అతఁ డచ్చటకు పోవునని నే నిశ్చయముగ నెఱుఁగుదును. కాని అందుచే నే నాతనికి ముందుగపోయి చీఁకటిలో వేచి యుంటిని—అంతియే. నన్ను కానీయక వెనుక నుంచి వేసెను.

రణ—తరువాత, తరువాత! విపులముగాఁ జెప్పుము.

సంజ—యంత్ర నిర్మాణమున నొకచోట బలహీనముగ నున్నదని అతఁ డెటులనో తెలిసి కొనెను; అచ్చటనే యంత్రి కరాచము వాఁడు కొట్టెను. ఆపిశాచము తిరిగి యార్తని చేసెను. అప్పుఁడా వాని మృత శరీరమును ముక్తధార, తల్లి యుంబోలె చేతుల పొదివి పట్టి తీసుక పోయెను.

గణే—మా యువరాజా కొఱకు వెతుక వచ్చితిమి. మాకేల వాఁడు కనఁబడఁడా?

నరం—కము గొంటికి నదా, శాశ్వతముగ మీ రాతని వేడుము!

[ భక్తులు పాడుచు ప్రవేశము. ]

జయ భైరవ జయశంకర
జయ జయ జయ ప్రళయంకర
శంకర శంకర.
జయ సంశయ భేదన
జయ బంధన ఛేదన
జయ సంకట సంహార
శంకర శంకర,
తిమిర హృద్విదారణ
జ్వలదగ్ని నిదారుణ
మరు శ్మశాన సంచర
శంకర శంకర.
వజ్ర ఘోష వాణీ
రుద్ర శూల పాణీ
మృత్యు సింధు సంతర
శంకర శంకర.

సమాప్తము.



పినాకిని ప్రెస్:—అనంతపురం.

